# గోలకొండపత్రిక

స్వభాను సం॥ర పుష్య బ ౭ సోమవారము


# ద్వితీయాశ్వాసము

ధాన్యగ్రహణ శాసనం, రైతుల లైసెన్సు, ధాన్యంధరల నిరోధ శాసనం, దుకాణాల శాసనం, ఎగుమతుల నిషేధం, పొగాకు పన్ను, సజ్జల మొనాపలీ—? మొదలైన శాసనాలు ఈనెల పదిహేను వూటలలో హైద్రాబాదు రాష్ట్రమందంతటను కావింపబడినవి. ఇవిఇంచుమించు విజయవంతముగా సాగింపబడిన వనుటలో సందేహములేదు. ఒకటవ ఆశ్వాసం ముగిసింది. ఇక రెండో ఆశ్వాసము లోనికి వచ్చినాము. పైశాసనాలలో పొగాకు పన్నువంటి వాటిని సరిగా అర్థముచేసుకొనక ఇంచుమించు దేశమందలి పొగాకు కంతటికిని బీడీల పొగాకు పన్ను వసూలు చేసినట్లు తెలియవచ్చినది. ధాన్యగ్రహణములో తర్వాత కొన్ని సవరణలు, పరిహారములు కావింపబడెను కాని అవి చాలా గ్రామాలలో ఇంతవరకుకూడా అమలులోనికి రాలేదని వినవచ్చినది.

రైతువర్గములోను, గ్రామ జీవనములోను చాలా సంచలనము కలిగినది. ఇట్టిశాసనాలుతటాలున విద్యారహితులగు ప్రజలపై ప్రయోగింపబడినప్పుడు లంచాల ద్వారాలు,కిటికీలు, రంధ్రాలు, దిడ్డివాకిళ్లు అన్ని ౨౪ గంటలు తెరువబడియుండుటకు అవకాశము కలుగును. పటేలు పట్వారీలకు ఇప్పుడే బంగారు పంట పండినది. జమాబంది కూడా ఇప్పుడే వచ్చినదికదా! నేతిలో రొట్టె తనంతకుతానే పడినది. పటేలు పట్వారీలలంచాలు, దౌర్జన్యాలు,అన్యాయాలు చాలా జరుగుచున్నవని వార్తలు సంతకాలుగలవి, సంతకాలులేనివివిశేషముగా వచ్చెను. జనులలో సత్యప్రకటనమునకు గూడా ధైర్యములేదని, సంతకాలులేని వ్రాతలు చెప్పుచున్నవి. పటేలుపట్వారీల దురాచారాలను రుజువు చేసేవారెవరు? వారి పై అధికారులు ఎందైన దౌర్జన్యాలుచేసితే వాటిని రుజువుచేసేదెవ్వరు? అది చాలా కష్టము. జనులకు ధైర్యములేదు. వారిలోపట్టుకాని, పట్టుదలకాని లేదు. వారికి చదువురాదు. వారు జవానునుచూస్తే భయపడుతారు. తమపటేలుపట్వారీలే తమకుహుజూర్లు, సదరెఆజంలు ఇక తక్కినవారి మాట చెప్పవలెనా? కావున ప్రభుత్వమువారు లంచాలుతీసినట్టి, మతపక్షపాతములేనట్టి నమ్మదగిన ఖుఫియాల ద్వారా పల్లెలలో జనులు ఏమేమి చెప్పుకొనుచున్నారో అదంతయు రికార్డుచేయించి తెప్పించితే వారు నిర్ఘాంతపోగలరు. ఇంతమాత్రమే మేము వ్రాయగలము. ఏగ్రామములో చూచినా తెలంగాణాలో దౌర్జన్యాలు, జరుగుచున్నట్లు, లంచాలు ఇచ్చుకొనుచున్నట్లు వాపోవుచున్నారని వినుచున్నాము. తూకంతో ధాన్యం తీసుకొనుట ర్యూ అంటే కొలుచుకొంటారట అదియు పెద్దకుండలతో కొలుతురట. ధాన్యమును పట్టిచూచి అరే ఇది ఎమిస్నీ, బాగాలేదు అని అనేది, దానికేమైనా సమర్పించుకొంటేసరేబాగుందిలే అనేది జరుగుచున్నదట. పెద్దరైతులు లైసెన్సులు పొందవలెనట. ఒక్కొక్కరు తమతమ లైసెన్సుకు అయిదో పదో ఖర్చుపెట్టుకొనుచున్నారట. లైసెన్సు ఫారంకొనుట, దానిలో ఉర్దూలో వ్రాయుటకు కూలీ, తస్దీక్ అనేదానికి సమర్పణను, తాలూకావరకు రానుపోను ఖర్చులు ఇవన్నీ తగులుచున్నవి

రైతులకు తెనుగే రాదు. పైగా వారు లెక్కలు వారి తాత ముత్తాతల కాలము నుండీ తర తరాల నుండి వ్రాసిన వారు కారు. ఇప్పుడు తెనుగులో కాదు ఉర్దూలో లెక్కలు వ్రాయవలెనట. అంటే ప్రతి గ్రామములో కొందరు ఉర్దూమున్షీలకు జీవనోపాధిదొరకుచున్న దనవచ్చుమాట. దొరకినను రైతులకువారిపై నమ్మక మెట్లు? ఆమున్షీలకు ఎక్కాలే రాకపోతే, ఎచ్చింపు కూడుట రాకపోతే వచ్చినను వారు తప్పుడులంకెలు వేస్తే ఎట్లు? మరి రైతు మాటలు మున్షీకి, మున్షీమాటలు రైతుకు సరిగా తెలియరావలెను కదా ఒకవేళవచ్చినను రైతుఒకటిచెప్పితే మున్షీ ఒకటివ్రాస్తే రైతుకొంప తీసినట్లేకదా!

సర్కారువారుధాన్యాలధరలుతగ్గించగానె ఎవ్వరున్నూ దేశమందు పల్లెపల్లెకుపోయి బోధించలేదుకదా' బోధించకున్నను రైతులు ధాన్యాలు అమ్మకమును చాలించిరి. సాహుకార్లు దుకాణాలను మూసివేయుచున్నారు అని వార్తలు వచ్చుచున్నవికదా! దీని ఫలితముగా అప్పుడే పెద్దరైతులవద్ద ఉండే నిలువధాన్యాన్ని తాలుక్దార్లు తీసుకొనిపోవుచున్నారని వార్తలువచ్చినవి. మన తాలూక్దార్లు, తహసీల్దార్లు, సుబేదార్లు సేద్యము పద్ధతులను ఎరిగియుందురు కదా. రాష్ట్రమంతటను పల్లెలలో రైతులుతమ జీతాగాండ్లకు సగము నగదు సగము ధాన్యము జీతముఏర్పాటుచేసు కొందురు కాని తుదకు సగమునగదు కూడా ధాన్యరూపముగానే చెల్లింతురు. సంవత్సరము పొడుగున రైతులు కూలీలతో పని తీసుకొందురు. కలుపు, కోత, పాపనం, ఎరువు,కతువలుకట్టుట, మోటరిపేరీలు వడ్ల కమ్మరివారితో పనులు, చెట్టుకొట్టుట, బావులపూడికలు తీయుంచుట, బండ్లుచేయించుట, చిల్లర రిపేరీలు, ఎదకూలీలు, పైమనుష్యులకూలీలు, ధాన్యంలోనుట్టితీయించి బాగుచేయించుట, ఇండ్ల పూతలు, తుదకు కోమటింటిలోని చిల్లరకిరాణము ఖరీదు, కూరగాయలఖరీదు ఇదంతా ధాన్యంతోనే జరుగునని మీరెరుగరా? ఎందుకు ధాన్యంతో వ్యవహారం చేయవలెన? పైసలియ్యరాదా అని అంటారామో? పైసలవ్యవహారమైతే చాలా రైతులకే లాభము వారందుచేతనే పల్లెలలో ప్రతిదానికిని పైసలిత్తుమందురు. కాని జనులువినరు. మాకు ధాన్యమే కావలెను లేకపోతే మీతో వ్యవహరించము అని వెళ్లిపోదురు. తెలంగాణాలో ఏ గ్రామములో నైనాసరే ఈ విషయాన్ని విచారించుకొని సత్యమును తెల్చుకొనవచ్చును- కావున రైతులకు సంవత్సరాంతము లోపల నే ధాన్యం లేకపోవును పది గ్రామాలలో చాలా పెద్దరైతు (లేక దొర)ఒకడు తప్పితే తక్కినవారంతా మళ్లీ ఎప్పుడుకళ్లాలగునా అని యెదురుచూచుచుందువారే. రైతులకు విత్తనం చాలా ముఖ్యం. వారు దానిని నిలువయుంచుకొనవలసి యుండునుకదా' కాని తెలంగాణాలో సరాసరి నూటికి ౭౦ మంది రైతులు విత్తనము కూడ సాహుకారి నుండి లేక పెద్దరైతుల నుండి లేక గ్రామాంతరాల నుండి నాగులకు లేక ఎక్కువధరలకు తెచ్చుకొని వేయుచుందురు. సంవత్సరాది [ఉగాది] నాడు ధాన్యశూన్యమైనఇండ్లవారు ప్రతిగ్రామములోనూటికి ౫౦వరకుందురు. అట్టివారంతా సంవత్సరాంతమువరకు కూలియిచ్చి ఒదులిచ్చి ఏదో రూపముగా సాకవలసినవారు పెద్దరైతులులేక గ్రామసాహుకారి, వీరు చాలాదుర్మార్గులే యగుదురు గాక. శిక్షింపయోగ్యులే యగుదురు గాక. దానికి గాను కొత్త కొత్త శాసనాలు హైద్రాబాదు రక్షణ శాసనముక్రింద చేయవచ్చును. కాని యిప్పట్లో జరుగుచున్న యాథార్థ్య మిదియని యువారే గ్రామాధారభూతులనియుఅనక తప్పదు. కావునప్రతిగ్రామములో ఇప్పుడెంత నిలువధాన్యమున్నదో ప్రభుత్వమువారు తమకువచ్చిన లైసెన్సు లెక్కలను బట్టి తెలుసుకొనియే యుందురు. ఇకరబ్బిపంటలు తెలంగాణాకు వరితప్పితే తక్కినవి ఇంచుమించుసున్నయేకదా. వరంగల్, కరీంనగరు జిల్లాలలోను ఇతరజిల్లాలలోను ఎక్కడెక్కడ రేగడి భూములుండునో అక్కడకొంత రబ్బిఖుష్కీ వేసియుందురు అదేపాటిది? తరికూడా వేసగిరి, అదియు కొద్దిపాటిది. ఇక మరాట్వాడీలో ఈ సంవత్సరము రబ్బిజొన్నలు సగముకంటే తక్కువ అని అంటున్నారు. ప్రభుత్వమువారు యథార్థస్థితినంతటిని విచారించవలెను. ఈ ప్రకారము చేసిన తర్వాత రైతులకు ఇబ్బందిలేకుండ ఆలోచనను చేయవలెను. రాష్ట్రములో బహుప్రాంతాలలో ధాన్యగ్రహణాలములలో అన్యాయాలు బహుళమైనట్లు తెలియవచ్చుచున్నది. లంచాల నిరోధానికి ప్రభుత్వము వారు లక్షల రూపాయలు ప్రత్యేకించియుండిరి. ఇప్పుడుదానిని వినియోగించి ఒక కమిషనను ఏర్పాటుచేసి ప్రతి తాలూకాకు పంపి రైతులనుండి సాక్ష్యములు తీసుకొనునట్లు చేయవలెను. కాని సాక్ష్యములిచ్చిన రైతులకు అపకారము కానట్టుగా చెక్బందీలు చేయవలెను.

ప్రభుత్వమువారు ధాన్యాల ధరలు తగ్గించిన సందర్భములో రైతులకు గల ఇతర అవసర వస్తువులు ధరలనుతగ్గింతుమని సూచించియుండిరి ధాన్యంధరలు యుద్ధపూర్వంధరల రెండంతల వరకు నిలబెట్టినామనిఅన్నారు, కావున రైతుల కవసరమైన ఇనుము కూడా యుద్ధపూర్వంధరల రెండంశల ధరలోనే రైతులకు ఇప్పించవలసియుండును. నైలపడేనుదిహాలైనది ఇక ఇనుము అవిధముగా రైతులకు సప్లయి అగుటలేదు రైతులకు పశువులు దొరకకుండాఉన్నవి మనకు పశువుల దిగుమతిని మద్రాసు ప్రభుత్వము నిషేధించినదట రైతులకు యుద్ధపూర్వ ధర కంటే అయిదంతల ధరలుపెట్టినా కూడా కొన్ని మాములు పశువులు దొరకుటలేదు. దున్నపోతులు కురుమూర్తి జాతరలో రెండునెలలక్రిందట ఒక్కొక్కటి ౨౫౦ రూ॥ వరకు అమ్మెనని వింటిమి' ఇక ఎద్దులధర యెట్లుండునోయేమో? రైతులకు ఎద్దులను యుద్ధ పూర్వంధరల రెండంతలధరలలో దొరుకునట్లు ప్రభుత్వము బాధ్యత వహింపవలసి యుండును. లేకుంటే ఏక్కువపంటపండిపచండీ అనే నినాదము అరణ్యరోదనమే అగును. తుదకు వంకాయలు కూడా పండించుటకు వీలుండదుసుమా? బట్టల ధరలు తగ్గించినామన్నారు. ఎవ్వరి నడిగినను "ఏమితగ్గించరయ్యా" అని అంటారు. గత సంవత్సరం ౧౮రూ॥ వదికమ్మిన ధోవతి జతఇప్పుడు ౨౫కు అమ్ముచున్నారు. ఇదే తగ్గింపు. ఇది యుద్ధపూర్వంధరల రెట్టింపుధరకాదు ఆరురెట్లధర! ౧౨ రూపాయిల ధోవతిని ౪రూపాయిలు కమ్మించితే అదీ న్యాయమనవలెను. కాని స్టాండర్డు ధోవతులుకూడా ౪రూ॥పైననే అమ్ముచున్నవి!

ధాన్యంధరలను మాత్రం తగ్గించితే ఈసమస్య పరిష్కృతముకాదు. మందులు. కట్టెలు, కాగితాలు ఇనుము,బట్టలు, ఇతరలోహాలు, పశువులు, పాలు, నెయ్యి, కూరగాయలు, జీవితావసరవులన్నిటిధరలున్నూ తగ్గించితీరవలెను. లేక అలజడియెక్కువగును. ప్రభుత్వము వారితో రైతులున్నూ సాహుకారులున్నూ సహకారము చేయవలెను. ఇబ్బందులుండిన వెంటనే ప్రభుత్వము వారు తొలగించవలెను. కాని రైతులు సాహుకారులు స్వార్థపరులై లేనిపోని అబద్ధాలతో అతిశయోక్తులతోఅలజడిని హెచ్చింపరాదు అధికారులు. సానుభూతితో పని తీసుకొనవలెను. రైతులు అధికారులు పరస్పర స్నేహవర్గముగా వర్తించుకొనవలెనేకాని ద్వేషులవలె వర్తించుకొనరాదు. ఈ విషయములో అధికారశక్తి కలవారైన ఉద్యోగులే చేయిచాచి రైతులను చేరదీయవలెను ప్రభుత్వమువారు ప్రజల ఇబ్బందులను విచారించి అన్యాయములు చేసినవారిని శిక్షించితేరైతు లకుమనశ్శాంతికలుగును.

ఇటీవల వార్తవలన, అహార పదార్థ సభయొక్క అధికారేతరసభ్యులు జిల్లాలకు దౌరా వెళ్లుచున్నారనియు, వారు రైతులకిప్పుడు కలుగుచున్న వేర్వేరు యిబ్బందులను గురించీ విచారింతురనియు తెలియుచున్నది అట్టిసభ్య మహాశయుల విచారణ విమర్శనాపూర్వకమైనదిగాను, నిష్పాక్షికముగాను ఉండగలదని మాశనుచు' వారి యనుభవములు తెలిసికొన నిరీక్షించుచుండగలము.

### కాచీగూడెం ఆర్యసమాజము

హైదరాబాదు (దక్కన్)నగరంలో కాచీగూడెం ఆర్యసమాజమందు జనవరి౧౭ సోమవారము రాత్రి౮-౩౦ గంటలకుజ్యోతిశ్శాస్త్ర పండితులగు శ్రీమాన్ స్వామి సర్వదానంద్ మహారాజ్ గారు యోగసాధనము, ఈశ్వరభక్తిఅను విషయముల గురించితెలుగులోఉపదేశము చేయగలరు (మంత్రి)

## సర్కారీ నియోగి సంఘం దౌరా

సలహాచెప్పుటకు హైద్రాబాదు ప్రభుత్వముచే నియుక్తులగు గోవిందరావు గంగాఖేడ్కర్ (సనాతని) యమీరాజా బేకి (ఇత్తెహాదుల్ ముస్లిమీన్) మఖ్దూమహమ్మదు. శ్రీ యస్. వెంకటరావు (అస్పృశ్యసంఘ నాయకుడు) గారలు కడచినం సోమవారం ౧౦కఇస్పందారునాడు బయలుదేరి మూడు దినాలు దేవరకొండ, పాలమూరు,నల్లగొండ,దేవరకొండ తాలూకాలలో దౌరా చేయుచున్నారు. వీరికి రెండు సర్కారీ మోటారులిచ్చి పంపుచున్నారు. వీరు మహబూబునగరు, నల్లగొండ తాలూక్దార్లతో కలిసి పంటల స్థితిగతులు తెలుసుకొని రానున్నారు. సోమవారం నాగరకర్నూలుకు వెళ్లుదురు. అచ్చటినుండి తక్కిన పైస్థలాలను చూతురు, గంగాఖేడ్కరుగారు తమ ఆచారానికి భంగము కలుగకుండగా తమ బ్రాహ్మణ వంట మనిషిని వెంటతీసుకొని పోవుచున్నారు.

## మహబూబునగరం

(ప్రత్యేక విలేఖరి) ౯-౮-౫౩

ఆంధ్రమహాసభ మహబూబునగరము జిల్లా కమిటీ అధ్యక్షులగు శ్రీ మందుముల రామచంద్రరావుగారు ఆహారపదార్థములకై ధరలనిర్ణయమైనపిదప, జిల్లాలో ఏర్పడినక్లిష్ట పరిస్థితులను తెలిసికొనుటకు, యిచటికి ఏతెంచిరి. జిల్లాలో గంజిలో మొత్తము ఆహారధాన్యముల వ్యాపారమే ఆగిపోయినకారణములను గంజులో ఉండే పెద్దవర్తకులతోను, చిన్నవర్తకులతోను కలిసికొని కారణాలను విచారించుకొనిరి. వర్తకులంతా తెలిపిన విషయమేమనగా, ధరలు ప్రకటించబడగ లక్షణమే, పెద్దవర్తకుల వద్ద ఉన్న ధాన్యమును, జిల్లాఅధికారులు జప్తుచేసికొని, అధికారులు నియమించిన, చిల్లర (౧౧) దుకాణాలలో మొత్తము గల్లా పంపకము చేయబడినదని, ఆ తరువాత గ్రామాదులనుండిధాన్యముమార్కెటుకురావటమే ఆగిపోయినదని తెలిపిరి. అధికార్లచే ఏర్పాటు గావింపబడిన (౧౧) దుకాణాలలో వార్షికమావనర్లయిచ్చే కోపనులపైన ఏవిధముగాధాన్యము విక్రయించబడుచున్నదో అధ్యక్షుల వారు తెలిసికొనిరి. మార్కెటుకు ధాన్యము రానికారణము తెలుసుకొనగా, గ్రామాదుల నన్నధాన్యమును, ఆయా స్థానికాధికారులు, తమ అనుమతులేనిది ధాన్యము క్రయముచేయగూడదని నిషేధించినందున, గ్రామాదులనుండి ధాన్యము రావటము లేదనియు, ఇందుకావలిసినధాన్యమును, అధికార్లుగలమారుల రైతులనుండి, సాహుకార్లవద్దనుండి, తమపర్యవేక్షణలో జిల్లాకుతెప్పించి తామునియమించిన (౧౧) దుకాణాల ద్వారా సప్లయి చేయుచున్నారని విచారణలో తెలిసినది, కొందరు గ్రామాదుల రైతులు, ఈనిర్బంధ ధాన్యముకాణాచువల్ల తమకు వ్యవసాయము అవసరాలకు, ముందు తమస్వంతయింటిచర్యలకు చాలాయిబ్బంది ఏర్పడునని అధ్యక్షులవారికి తెలిపిరి. ఈసందర్భమున [illegible] పై అధికారులకు తార్లు పంపినామని తెలుపుకొనిరి. జప్తర్లమరియు, ఇతరగ్రామాదుల పరిస్థితులను తెలిసికొని,జిల్లాకమిటీఅధ్యక్షులవారుతిరిగిశుక్రవారమునాడు హైద్రాబాదుకు వెళ్ళిరి.

